కొనుట కత్యావశ్యకములగు చిల్లరవస్తువులనుగూడ దేశాంతరములనుండి తెప్పించుకొని తనయల్పమాత్రాదాయమును వానికి కొల్లయిచ్చుచున్నది. పరిశ్రమలను, వర్తక వ్యాపారములను అభివృద్ధిపరుచుకొనని దేశమెన్నడును ధనవంతము కాజాలదు. సాటి దేశములు దానిని సరకుగొనవు. ఆదేశమున ప్రజలు సుఖదూరులయి నిరంతరము నిడుమలగుడుచుచుందురు. "రూకలేనివారు పోకకు గొరగారు."

స్వాతంత్రములయ్యును, మొనమొన్నటి వరకు పేరుపొందులు లేకుండిన చీనాజపాను దేశములు నేడు ప్రపంచమాన్యము లగుటకు కారణమేమి? వివిధపరిశ్రమలను, వర్తక వ్యాపారములను నితాంతము నభివృద్ధిచేసికొని తద్ద్వారమున నఖండైశ్వర్యమండితము లగుటయేకదా! "ధన మూలమిదం జగత్" అన్నది సూక్తి.

ఆంధ్రరాష్ట్రము సబ్బులు, దువ్వెనలు, తైలములు, ముఖచూర్ణములు(Face Powders), కత్తులు, కలములు, రొక్కపు సంచులు (Money Purses), వివిధములగు పిల్లల ఆట వస్తువులు మొదలగు చిల్లరవస్తువులను కూడ తయారు చేసికొనజాలకున్నది. ఈదేశ మిట్లగుట పెల్లుమీరిన యలసతమూలమునగాని, పెద్దపరిశ్రమలను సాగించుచున్న ఇతరభారతీయరాష్ట్రముల కుండుసౌకర్యములు లేక కాదు. ఇట్లుండిపోయిన నీదేశము ధనసంపన్నమగుట యెట్లు? ధనాభావముచేత నేకదా విశ్వకళాపరిషత్తు వెనుకబడియుండునది! ఆంధ్రరాష్ట్రప్రాప్తి సంశయగ్రస్త మయి యుండునది!! అభ్యుదయహేతువు లగు నితరకార్యము లెన్నియో అడుగంటియుండునవి!!! ఆంధ్రులికనయిన నస్థిగతమయియున్న బద్ధకమును వెడలనడిచి ఉత్సాహవంతులు, కార్యశూరులు నయి పరిశ్రమలను, వర్తక వ్యాపారములను తామరతంపరగా వెలయించి సిరిసంపదలతో దులదూగుచు తమదేశమున కభ్యున్నతిని సమకూర్చుకొనదగుదురు.

ప్రకృతము రాజమహేంద్రవరమున అజంతాకంపెనీవారు కొమ్ముదువ్వెనల పరిశ్రమ నారంభించి సాగించుచు తదితరులకు మార్గదర్శకు లయినారు. సుప్రసిద్ధదేశాభిమానులు శ్రీపందిరి మల్లికార్జునరావుగారు దీని కధిపతులు. ఈదువ్వెనలపరిశ్రమకు ముడివస్తువు-కొమ్ము-ఆంధ్రదేశమునందలిది; వీనిని తయారుచేయుపనివారు పనితనమున చేయితిరిగిన ఆంధ్రులు. ఇది యంత్రసహాయమావశ్యకముకాని గృహపరిశ్రమ. ఇది పేదలగు పలువురాంధ్రులకు జీవికను కల్పించినది. ఇట్టిపరిశ్రమ సంపూర్ణముగ నాంధ్రత్వమున విరాజిల్లినది.

పరిశ్రమ మొనమొన్ననే ప్రారంభమయినదయ్యును, అందమమరిన వింతవింత మాదిరుల దువ్వెనలను—ముప్పదిమైదుగకములవానిని—తయారుచేసినది. పనితనమున,

గట్టిదనమున నవి యితర దేశములవానిని మిక్కిలి క్రిందుపరచున వయినను వాని వెల మాత్రము చాలసరసముగా నున్నది. ఇది యంతయు పరిశ్రమాధిపతులకార్యనిర్వహణ కౌశలమును వ్యక్తపరుచుచున్నది. కాగిత ములకోతకు, నాలుకగీతకు, మందులు కలు పుటకుకూడ కొమ్ముబద్దలను వీరు తయారు చేయుచున్నారు.

దువ్వెనల యుపయోగమును ఈ కాలమువారు చక్కగా నెరుగుదురు. వీని యెడ నాదరమును చూపి సర్వాంగీణముగ నాంధ్రమైన యీపరిశ్రమ నాంధ్రులు పోషిం చుట ధర్మము. మరియు నిట్టి యితరచిన్నపరి శ్రమలను పెక్కింటి నారంభించి యాంధ్రులు సాగింపదగుదురు; తమకును, తమ దేశమున కును పేరుప్రతిష్ఠల నార్జింపదగుదురు.

---

## భారతమహిళా సంఘము

పదియారవ వార్షికనివేదిక, 1932-1993)

శ్రీమతి డొరతీజినరాజదాసగారీసంఘమును ౧౯౧౭ మేనెల ౮-వ తేదిన స్థాపించిరి. స్త్రీజనాభ్యు దయము వీరిముఖ్యోద్దేశము. రాజకీయ, సాంఘికాది విషయములందు పురుషులకువలెనే స్త్రీలకును సమాన ములను హక్కులను సంపాదించుకొనుట కీసంఘమువా రెంతయు పాటుపడుచున్నారు. బాలబాలికలకు నిర్బం ధప్రారంభవిద్య యుండవలయునని వీరివాదము. చాల కాలమునుండి హిందూసంఘమున నాటుకొనియున్న కొన్నిదురాచారములు, బాల్యవివాహములు, అస్పృ శ్యత మొదలగువానిని రూపుమాపుటకై వీరు కంక ణముకట్టిరి.

ఈ సంఘమునకు సంబంధించిన యుపసంఘము లనేకములు దేశమంతయు నెలకొనియున్నవి. సభ్య త్వమువిషయమున వీరు, జాతి, మత, వర్ణ భేదములను పాటించుట లేదు.

ఈసంఘమువారిచే 'స్త్రీధర్మ' యనుమాస పత్రికయొకటి ప్రకటింపబడుచున్నది. స్త్రీజనమున కుప యుక్తములగు వ్యాసములందు ఇంగ్లీషునను, హిందీ యందును, అరవమునందును, తెనుగునందును ప్రచు రింపబడుచున్నవి. ఈపత్రికయొక్క చందాదారులు జపాను, చైనా, ఆస్ట్రేలియా, బ్రిటిషుదీవులు, ఈజిప్టు, ఫ్రాన్సు, ఇటలీ, జర్మని, అమెరికా మొదలగుదేశ ములం దున్నారు. ఈసంఘమువారిప్రచారము ఈ పత్రికమూలమున విశ్వమంతయు వ్యాపించుచున్నది.

స్త్రీలకు సంబంధించిన రాజకీయవిషయములందు ప్రభుత్వమువారు ఈసంఘమువారియొక్క అభిప్రాయ ములను సలహాలను గోరుచున్నారు.

దేశనాయకులు నీ మనదేశస్త్రీలయున్యమమును ప్రోత్సాహపరచి స్త్రీ పురుషులకు సమానములగు హక్కుల నేర్పరచవలయును.

---



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M136 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 191 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 9 to 0836 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | S.Valishale |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |